

శ్రీ

# ప్రబోధిని.



శ్రీ కృష్ణా, గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ
సమాజ పక్షమున ప్రకటింపఁబడు మాసపత్రిక.

ఇందు నీతి,మత,సంస్కరణ,భాషా, శిల్పవిషయములు చర్చింపఁబడును.

సంపుటము.7. } గుంటూరుజిల్లా,దుగ్గిరాల, జులై 1915. } సంచిక. 7.

## సమాజములు - వార్షికోత్సవములు.



సత్వరజస్తమోగుణముల సంఘీభావమువలన చలనము వ్యక్తి మున్నగు సృష్టివికారము లేర్పడుచున్నవి. ఉష్ణశీతముల సంయోగమువలన సజీవ నిర్జీవభేద మేర్పడును. గుణధాతువుల సమావేశమువలన శరీరతత్వము నడచుచున్నది. ఉష్ణశీతములు పృథివ్యాది పంచభూతములు. మున్నగువాని సంఘీభావమువలననే చలించుట శమించుట ప్రకోపించుట మున్నగు సృష్టిహేతువులగు శక్తు లుద్భవించును.

మనుజుడు సాంఘికజీవి. కృతయుగాది కాలములయందలి మనుజులు
ఇంద్రియములను జయించి మనోబలమును వృద్ధిపఱచి సమస్తకార్యములను సం
కల్పమాత్రమున జయింపఁగలిగియుండురట! కాని 'కలౌ సంఘే శక్తిః' అ
నువాక్యము సుప్రసిద్ధము. శక్తివంతమైన కార్యములన్నియు నొకఁడు మానవు
నిచే జఱుపఁబడుటకంటె నొక సమాజముచే జఱుపఁబడుట సులభము. స
మాజములేక మనుజు డేకార్యమును చేయఁ జాలడు. జీవింపను లేఁడు.
శీతోష్ణములవలె సుఖదుఃఖములు కలసి మెలసి మనుజుల నావరిం
చుచుండును. నరుడు దుఃఖమును ఎక్కువసేపు భరింపఁజాలడు. సుఖము
ను దుఃఖమును దుఃఖోపశమనమును సమాజమువలన నేర్పడును. యతిఆశ్ర
మమున నుండువాఁడు నిలచినచోట రెండుపూటలకంటె నెక్కుడుకాలముండ
గూడదని చెప్పెదరు. నిలచినచోట నెక్కువసేపు నిలచినమిత్రులేర్పడుదురు.
సర్వసంగపరిత్యాగము చేసినయోగి యొకపొదరింట మూడుదినములు నివసించు
టచే నతనిసమీపమున నొకకుక్కపిల్లలను బెట్టెననియుఁ దన్నాశ్రయించుకొ
నియున్న కుక్కకొఱకు భిక్షమెత్తుటకు యోగి గ్రామములోనికివచ్చెనని యొక
కథను మనము వినెదము. దుఃఖసముద్రమున మునిఁగియున్నవానిని బంధుమి
త్రులోదార్చుటవలన నాదుఃఖము శమించును. బంధుమిత్రుల ప్రేమపాశ
ములచేఁగట్టబడుటవలన మనుజుఁడు సుఖముల ననుభవించును. కావుననే మ
నుజుఁడు సాంఘికజీవియనఁబడును. మనుజుఁడు తనకుఁగావలసిన నీతి స
త్యము ప్రేమ మున్నగునవి సమాజమువలననే నేర్చికొనఁగలఁడు. గుహాంతర
మున తపస్సుచేయు యోగికంటె స్త్రీపురుషులలో కలసిమెలసి అక్క, చెల్లె
లు, తల్లి, భార్య, మున్నగువారిలో నెవరియందెట్టి ప్రేమను చూపదగునో వా
రియందట్టిప్రేమనుచూపు సాంఘికజీవియగునరుఁడు ఎక్కువనీతిని నేర్చికొనఁ
గలఁడు. ధర్మాధర్మములు, నీతి అనీతి మున్నగునవి సమాజమువలననే నే
ర్చికొనవలసియుండును.

వేయిమందిలో నొకనికి సహజసద్గుణము లలవడును. అతఁడెట్టి బం
ధుమిత్రులలో కలసిమెలసి తిరుగుచున్నను వారి దుర్గుణములతనికంటఁజాలవు
కాని సుగుణములు వృద్ధిపడును. మొత్తముమీద సుగుణములకంటె దుర్గుణ

ములు వేగముగా నభివృద్ధిఁజెందును. ఒకఁడు నస్యమును బీల్చుచుండ వేఱొకఁడు అనవసరముగనే ఇందు కాఘ్రాణించి చూచుటయు, మద్యపానము, వేశ్యాలోలత, జూదము మున్నగు దురభ్యాసములుగలవారు మిత్రులుగా నుండుటవలనఁగొందఱాయలవాటులఁజవిజూచుట సుప్రసిద్ధము. ఇరుగుపొరుగున నుండువారు దుష్ప్రవర్తనగలవారైనచో కోమలమనస్కులగు బాలబాలికలు తాము దురభ్యాసపిశాచమునకు వశపడుచున్నామని తెలియకయే చెడుదురు. 'ఏవాడచిలుక ఆవాడ పలుకఁబలుకు' ననుట కిదియే కారణము. వేషభాషలును ఆచారములును ఒక్కొక్క ప్రాంతములయందుండువారికి ఒకేవిధముగదా. తెలుగు స్వభాషగలవాఁడు అరవముమాట్లాడుప్రదేశమున నుండవలసినపుడు ఆ భాషను అప్రయత్నముగా నేర్చికొనును.

లోకమునందలి మహాకార్యములన్నియు సమాజమువలననే జరుపఁబడుచున్నవి. అచ్చొత్తుట, మహాభవనములు వారధులు మున్నగువానిని నిర్మించుట సమాజమువలననే సంభవించును. గొప్పమొత్తముగల ధనముచే నొక కార్యమును చేయవలసినప్పుడు కొద్దిచందాలతో గొప్పసంఖ్యగల సమాజముల నేర్పఱచి లాభమును పొందెదరు. ఒక గ్రామమునందలి మనుజులందఱొక సమాజమేర్పఱచి విధిగా పన్నుగట్టినటుల తలకింతయని చందాను వసూలుచేసి గ్రామమునందు వైద్యశాల, పాఠశాల, సహాయనిధుల నేర్పఱచియు, పురపారిశుద్ధ్యము న్యాయవిచారణ, మున్నగువానిని చేసియు, తమ్ము దాము పరిపాలించుకొనవచ్చును. ప్రస్తుతము విదేశీయులు అనేక కార్యములను సాధింపఁగలిగియుండుట కిదియే సాధనము. దేశమునకు క్షీణదశ ప్రారంభించినతోడనే సమాజములు తమకుగల సామర్థ్యమును మఱచినవి. రాను రాను ప్రతిమనుజుఁడును తాను సాంఘికజీవనను స్మృతినితప్పి సమాజమనుమాట విని వింతపడవలసినవాఁడగుచున్నాఁడు. మహాకార్యనిర్మాణమును కేవల మీశ్వరాజ్ఞకై విడచుచున్నాఁడు. బుద్ధిమంతులగు మనుజులీవిషయములను గ్రహించి సమాజముల నేర్పఱచి కొన్నివిధులను కల్పించుచున్నారు. సమాజవిధుల ననుసరించి నియమితకాలములయందు సభలు జరుపఁబడుచున్నవి. ప్రస్తు

తము సంఘమున కెట్టి శక్తులుకలవో మఱచియున్న దేశమున సమాజము లేర్పఱచుటయు మహారణ్యమున నచ్చటచ్చట పాఠశాలల నిలుపుటయు సమముగా నున్నది. అరణ్య పాఠశాలలయందలి యుపాధ్యాయు లాప్రాంతముల నుండువారికి భయకల్పితు లగునటుల, సమాజముల యందలి సాంఘికులు సామాన్యులచే మోనగాండ్రుగా పరిగణింపఁబడుచున్నారు. ప్రస్తుత మాంధ్రదేశము దుస్తులతోడను జుట్టుకట్టు మున్నగువానితోడను నాగరికతజెందినది. కాని విద్యావ్యాపకము బుద్ధివికాసము సర్వసమత్వము మున్నగువానిచేఁ నాగరికతఁ జెందలేదు. సమాజములు వానిని సంస్కరించవలయును. సమాజములు వార సభలు మాససభలు వార్షికోత్సవములు జఱుపుట మున్నగువానితో తమ విధుల నిర్వహించుచున్నవి. నీతిని వహించుట పరస్పరము ప్రేమించుట విద్యను వ్యాపింపఁ జేయుట భేదభావముల నడచివేయుట దురాచారములనంటకుండుట వివాహాదులను సంస్కరించుట మున్నగువిధులను దీక్షావ్రతములయందుంచి పూజించునపుడుమాత్రము సమాజ వార్షికోత్సవములవలన ఫలముండదు. తప్పుజేసిన వాని నురిదీయుట లోకమునకొకపాఠమును బోధించుటకుఁగాని మరణించినవాఁడట్టి నేరము చేయకుండుటకుగాదు. పరీక్షలలో జయమొందిన బాలబాలికలకు సభలలో బహుమతులిచ్చుట తోడివారి నుత్సాహపఱచి విద్యాసక్తులుగాఁ జేయుటకుగాని జయమొందినవారిని గర్వపఱచుటకుగాదు. ఊరూర సమాజములేర్పడువఱకును సమాజికులువార్షికోత్సవములను మిగుల నాడంబరముగా జఱుపవలెను. ప్రస్తుతము మన దేశీయులయందు సమస్తశక్తులుఅణఁగియున్నవి. వానిని వెలికిదీయుటకై ప్రతిగ్రామమునందును సమాజములేర్పఱచుటయు వార్షికోత్సవములు జఱుపుటయు ఆవశ్యకము.



# కన్యావరశుల్కములు.

వివాహములయొక్క పవిత్రతను చాలవఱకు నిర్మూలము చేసినవానిలో ముఖ్యమైనవి కన్యావరశుల్కములు. కన్యతండ్రి ద్రవ్యహీనుడుగా నుండుట వలన ఒకటి రెండుగోవులనిచ్చి కన్యనుగొనవచ్చుననునది ఆర్షవివాహ మనఁబడును. గోవులే ధనమని చెప్పఁబడిన పూర్వుల వాక్యములు కలవు. అనగా ఆ కాలమున రూపాయలు లేవని తెలియగలదు. మనదేశమున వకప్పుడు వరహా అను వేఱొకప్పుడు గవ్వలను వాడుకొనెదరు. గోవులకుమారుగా ప్రస్తుతము రూపాయలనిచ్చుచున్నారు. కన్యతండ్రికి ఒకటి రెండువందలరూపాయలనిచ్చుచున్నారు. క్రమముగా కన్యతండ్రికి ఎన్నివందలు అవ్వగలదో ఆ మొత్తమునంతయు చెల్లించవలసి వచ్చుచున్నది. తరువాత తండ్రియొక్క దారిద్ర్యముతోడ పనిలేక కేవలము కన్యను విక్రయించుటకు మొదలిడిరి. అది మొట్టమొదట 'కడుపుపండినచో కావలసినంత ధనముదొరకు' ననుధర్మమును తలదాల్చుటవలన నాకింత హితకరముగానుండెను. తరువాత రూపాయలవాడుక ఎక్కువైనందునను కన్యలకు జ్ఞానమభివృద్ధిజెంది తాము విక్రయింపఁబడుట జుగుప్సాకరమని తిరస్కరించుటవలనను వాసి తగ్గెను. ఇందు కొక యుదాహరణ కలదు. పదునాలుగు సంవత్సరముల వయస్సుగల కొమార్తెను పదునాలుగువందల కమ్ముటవలన కన్య రోతఁజెంది వెంటనే తండ్రిగృహమును విడిచిపోయెను. క్రమముగా కన్యావిక్రయము నరమాంస విక్రయమనియు, అది హేయమనియు పాపకార్యమనియు బోధించువారి భావము సమాజములకు తలకెక్కినది. అందువలన కన్యాశుల్కము కొంచెము తగ్గినది. ఎకరమునకు రెండుపుట్లుపండుటయు పుట్టి డెబ్బదిరూపాయల ఖరీదగుటయు కన్యాశుల్కము కొంచెము తగ్గుటకు కారణములైనవి. కన్యాశుల్కమొక వ్యాధివంటిది. వ్యాధియొక్క చయప్రకోపములను గుర్తెరుగక చికిత్స చేయఁబడుటవలన శమింపనేరదు. ప్రస్తుతము కన్యాశుల్కమింక

కతగ్గినకారణము ధనము వృద్ధిజెందుటవలనగాని విద్యాసంస్కారణభావములు వృద్ధిఁ జెందుటవలనఁ గాదు. ధనము వృద్ధిఁజెందుటవలన వరశుల్కము ప్రబలుచున్నది. వరశుల్కమువలన ననేకకుటుంబము లప్పులపాలైనవి. వరశుల్కమువలన కొందఱుకన్యలు అకాలమృత్యువుచే భర్తలను గోల్పోయినప్పుడు మిగుల నిరాధారు లగుచున్నారు. కొన్ని ప్రదేశములయందుకన్యలు తమవరులకు శుల్కమిచ్చుటఁజూచి 'నాకైకొన్నపశువు నేనుండుచోటనేనుండవలయునుగాని పశువుండుచోటునకు నేనుపోనక్కరలేదు' అనుభావము బయల్పడ వరునితో గృహప్రవేశమునకు బోనుల్లంఘించుచున్నారు. శుల్కముగా నియ్యవలసిన ధనమును సమకూర్చుటకై పరితపించుటగని కన్యలు ఆత్మహత్య గావించుకొనుచున్నారు.ఇన్నివిధములగు బాధలున్నను వరశుల్కములు వృద్ధిఁజెందుచునే యున్నవి. వీని ప్రస్తుతస్థితి ఇట్లుండ పూర్వస్థితిని విచారింతము. అనగా మనపూర్వులెవ్వరైన వరులకు శుల్కమిచ్చిరాయను ప్రశ్నకుత్తరువియ్యవలసియుండును. శుద్ధచరిత్రలేని కన్యను స్వీకరించుటకు వరునకు శుల్కమియ్యవలయునని చాణుక్యుని అర్థశాస్త్ర శిక్షాస్మృతివలనఁదెలియుచున్నది. అనగా కన్యతండ్రికి జరిమానా విధించుటయనిభావము. కన్యాశుల్కముకంటెను వరశుల్కము మిగుల హేయమైనదని తెలియుచున్నది. పెద్దలారా మహానందముగ వరునకు శుల్కమిచ్చి సుగుణవతులగు మీబిడ్డలయొక్క చరిత్ర అపవిత్రమైనదని యథేచ్ఛ నంగీకరించుటకంటె యవివేకము గలదా! విద్వాంసులు, న్యాయాధికారులు, న్యాయవాదులు, భూస్వాములు ధనికులు దేశాభిమానులు నవనాగరికులు మున్నగువారందఱును తమబిడ్డలను నీచులుగా జేయుచున్నారుగదా? సభలకెక్కి కన్యావరశుల్కములు గర్హనీయములని బల్లగుద్ది యుపన్యాసముల నిచ్చువారే శుల్కమిచ్చినఁగాని కన్యను స్వీకరించుటలేదని చెప్పుచున్నారు. ధనాశచే శుద్ధచరిత్రలేని కన్యలను స్వీకరించుచున్నారమని వారు గ్రహింపఁజాలకుండుటకు చింతిల్లవలసియున్నది.

ఒకప్పుడమెరికాలో బానిసవ్యాపారముగలదనుట చరిత్రాంశములవలనఁ దెలియునుగదా? అవసరమునుబట్టి పదిమేకలు నూరు నూటయేబది రూ

పాయలను కొనినట్లు బానిసలకు వెలకుగొందురు. శుల్కమునఁగొనఁబడిన కన్యావరులు బానిసలకు సములని నిర్వివాదముగ నంగీకరింపవచ్చును. కాని సలస్వతంత్రులగుటచే వారిబుద్ధియందు వికాసము సాహసవితరణాది గుణము లుండఁజాలవు. మనలో ననేకులు అత్తవారు రెండెకరములు పొలమియ్యక మానరు నేనుసంపాదించనేటికి అనుకొనుచుందురు. ఇందువలన ననేకులకు స్వార్థపరత్వముచెడి మనోబుద్ధులు దాశ్యమున కియ్యకొనుచున్నవి. వధూవరులు పరస్పరము దాసులును బానిసలును అగుటవలన వివాహముయొక్క పవిత్రత చెడుచున్నది. అప్పులపాలగుచున్నారు. నీచబుద్ధు లలవడుచున్నవి. స్వార్థపరత్వము చెడుచున్నది. కావున కన్యావరశుల్కములను పూర్ణముగ నిషేధింపవలయును.



# కోల్లారు
# విశ్వబ్రాహ్మణ బాలసమాజము
# నాల్గవ వార్షికోత్సవము.



ఈసమాజముయొక్క వార్షికోత్సవము, జూన్ 19,20 తేదీలయందు జయప్రదముగ జరుపఁబడెను. 18 వ తేదీ సాయంకాలము ఓరుగంటి సూర్యనారాయణగారిచే పాటకచేరి జరుపఁబడెను. 20 వతేది సాయంకాలము 4 గంటలకు వార్షికోత్సవము ప్రారంభమయ్యెను. బ్రహ్మశ్రీ పాతకమూరు రా

మబ్రహ్మంగా రగ్రాసనాధిపతిగా నెన్నుకొనఁబడిరి. సమాజముల యొక్క ప్రయోజనములనుగూర్చి దీర్ఘోపన్యాసమునిచ్చినపిమ్మట సమాజమువారి రిపోర్టు చదువఁబడెను. సభ్యుల యుపన్యాసములు, మధ్యమధ్య నీతినిబోధించు ప్రహసనములు, ప్రార్థనలతో సభ ముగింపఁబడెను.

## రిపోర్టు.

---

స్వాగతము:—భగవానునికృపచే దినదినాభివృద్ధిజెంది మీబోటి సదయుల యాశీర్వచనముచే వర్ధిల్లును, ఎల్లప్పుడు సర్వజనోపకారిగా నుండునట్లు అనుగ్రహింపుమని సృష్టికర్తను వేడుకొనుచు సౌఖ్యదాయకముగా కాలముగడుపుచున్న మాబాలసమాజము మీకందరకు సుస్వాగత మిచ్చుచున్నయది. బాలురకార్యమని యోచింపక ఏతెంచి మాకు ఉత్సాహబీజమును నాటిన ప్రేక్షకులకును, ప్రతినిధులకును, సభ్యులకును యింకొకసారి స్వాగత మిచ్చుచున్నది.

ముఖ్యోద్దేశము:—మన దేశమునకును, యితరదేశములకును చాల వ్యత్యాసముగలదు. మన దేశము జాతి, మతభేదములకు లోనైయున్నది. అట్టి మన ఈ హిందూదేశ మభివృద్ధిదశకు రావలెనన్న జాతి మతభేదములు నశింపవలెను లేనియెడల ప్రతిసంఘ మభివృద్ధిదశ నొందవలెను. అట్టి సంఘాభివృద్ధికే ఈసంఘము స్థాపింపబడినది.

ప్రస్తుతస్థితి:—మాసమాజముయొక్క ప్రస్తుతస్థితి చాల సంతోషకరమైనది. మెంబర్లసంఖ్య ప్రతిసంవత్సరము హెచ్చుచున్నది. పొత్తములుకూడా హెచ్చుచున్నవి. ఈసంవత్సరమే కొన్ని యాంగ్లేయగ్రంథములనుకూడా పుస్తకభాండాగారమునందుజేర్చినాము. యితరులచే వాడబడిన పుస్తకముల సంఖ్యనానాటికి హెచ్చుచున్నది.

| నెం. | విషయము. | 1914 | 1914-15 |
|---|---|---|---|
| 1 | చందాదారులు | 26 | 29 |
| 2 | తెలుగుగ్రంథములు | 225 | 307 |
| 3 | ఇంగ్లీషుగ్రంథములు | 0 | 25 |
| 4 | ఆదాయము | 97-9-6 | 151-15-9 |

సభలు:—ఈసంవత్సర మెనిమిదిసభలు జరిగినవి. అందు పలువిషయములనుగుఱించి చర్చింపబడెను. అందు ముఖ్యమైన విషయములు విద్య శిల్పములు, చిత్రలేఖనము అతిబాల్యవివాహములు

మహాజనసభ:—పలు వైషమ్యములలోజిక్కి మహాజనసభ యొకవత్సరము జరుగలేదు. మహాజనసభ యొనర్చునట్లుగా భగవంతుడు మమ్ము ప్రేరేపించెను. యిరువదిదినములుమాత్రమున్నదనగనే తత్కార్యమునకుపూనుకొంటిమి. మహాజనసభకు ఖర్చుపెట్టినధనము రు 431-11-0 ఈధనమంతయు ధర్మచందాలవల్ల స్వీకరించినదేగాని మూలధనమునుండి యావంతయు గదల్చలేదు. అట్టి మహత్కార్యమును మే మెట్లొనర్పగలమని భయపడితిమిగాని భగవానుడు మాకుదోడయ్యెను. సభాకార్యమును నిర్విఘ్నముగా జరుపబడినందుల కెంతయో సంతసిల్లుచున్నారము. అందుచే మాసమాజకన్య ప్రతివారి చూపులను తనవైపునకు ఆకర్షించుకొనగలిగినది. మహాజనసభకు మాకన్నివిధముల తోడ్పడినవారికి మా మనఃపూర్వకనమస్కారము లాచరించుచున్నారము.

బహుమతులు:—నర్సాపురసంఘమువారు స్త్రీల పోటీపరీక్షలు గావించుచున్నారు. ఆపరీక్షలలో జయమొందిన మొదటియిద్దరు విశ్వబ్రాహ్మణ బాలికలకు వెండిపతకములిచ్చునట్లుగా మేము తీర్మానించుకొంటిమి. ఆ తీర్మానమును ననుసరించి రెండు వెండిపతకముల బహుమతిగా నొసంగినారము.

బహుమతిపొందిన బాలికలు.

| | |
|---|---|
| పొప్పులూరి కనకదుర్గాంబ | దుగ్గిరాల |
| యం. రత్నమ్మ | గుంటూరు |

భాండాగారము.

| | |
|---|---|
| సభ్యులచే వాడుకచేయబడిన పుస్తకముల సంఖ్య | 169 |
| సభ్యేతరులచే | 426 |

సగటున దినమునకు మాపఠనమందిరమునకు విచ్చేయు వారిసంఖ్య 12

మాయుద్యమమునకు తోడ్పడి మాకు యుచితముగా పుస్తకములనొసంగినవారికి మానమస్కారములు. భాండాగారమునందు యింగ్లీషుగ్రంథములుంచుట చాల మంచిదని మాకు ప్రోత్సాహపరచి యింగ్లీషుగ్రంథముల నుచితముగా నిచ్చిన బ్రహ్మశ్రీ వెలగలేటి నాగభూషణంగారికి మా నమస్కారములు.

పత్రికలు:—మాకు రెండువారపత్రికలును, ఒక మాసపత్రికయు వచ్చుచున్నవి. వాటిలో మాసపత్రికయగు ప్రబోధినిని మా కుచితముగా పంపుచున్నందునకు ప్రబోధిని పత్రికాధిపతిగారికి మా నమస్కారములు. మాకు ఆంధ్రపత్రికయు, కృష్ణాపత్రికయు వచ్చుచున్నవి. అందు కృష్ణాపత్రికయొక్క ప్రతిని మా సమాజపుధనముతో తెప్పించుచున్నారము. ఆంధ్రపత్రికను మా సభ్యులలో నొకరు ఉచితముగా నిచ్చుచున్నారు. 'విజ్ఞానచంద్రిక' యందు చందాదారుగానుండి ఆపొత్తములన్నిటిని మాకుచితముగా నిచ్చుచున్న బ్రహ్మశ్రీ కందేపు వెంకటరత్నంగారికి మానమస్కారములు. మాసమాజమునకు ట్రస్టీగా నుండి సమాజము నివసించుట కుచితముగా నొకగదినొసంగిన బ్రహ్మశ్రీ శ్రీరాం గంగయ్యగారికి మానమస్కారములు.

| జమ | | ఖర్చు. | |
|---|---|---|---|
| గతసంవత్సరపునిలువ | 97- 9-6 | కృష్ణాపత్రికకు ఒకసంవత్సరమునకు | 3- 1-0 |
| సాంఘికులనుండి వసూలు చందా | 33- 0-0 | గ్రంథములకు | 1- 2-0 |
| విరాళములు | 2- 7-3 | దైవవుత్సవములకు | 0- 4-6 |
| శుభకార్యకట్నములు | 7- 8-0 | బహుమానపతకములకు | 2- 5-0 |
| మనికట్టుచీట్లబాపతు | 23- 7-6 | లైటు | 1- 8-6 |
| రూపాయికి కానిధర్మచందా | 7- 8-0 | గతవార్షికోత్సవమునకు ఖర్చు | 11-13-9 |
| సంభావన | 3- 5-0 | చిల్లర పోస్టేజివగైరా ఖర్చులు | 2-10-9 |
| మహాజనసభకు విరాళములు | 431-11-0 | మహాజనసభకయినఖర్చు | 431-11-0 |
| | | నిలువ | 151-15-9 |
| | 606- 8 3 | మొత్తం | 606- 8-3 |

లెక్కలు తనిఖీదారుని రిపోర్టు:—శ్రీ కొల్లూరు విశ్వబ్రాహ్మణ బాల సమాజపు 5—5—14 తేదీమొదలు 13—6—15 తేదీవరకు గల లెక్కలను తనిఖీచేసినాను. సరిగాయున్నవి.

(SD) పి. రామమూర్తి
ఆడిటరు.

నే మడిగినంతనే యొప్పుకొని మాలెక్కలను కడు శ్రద్ధతో తనిఖీచేసిన మహారాజశ్రీ పోలిశెట్టి రామమూర్తిగారికి మానమస్కారములు.

విజ్ఞాపన:—పూజ్యులారా! యింతవరకు చదివినదానింబట్టి మా సమాజముయొక్క స్థితియంతయు మీకు గోచరముకాగలదు. యింతవరకు మేముచేసినది బహుస్వల్పము. చేయనున్నపనులు చాలగలవు. దైన మింకను మా

కతోడ్పడలేదు. మీబోటి పెద్దలసహాయములేనిది మే మేమియు చేయలేము. మాసంఘాభివృద్ధికి మేముచేయు ప్రయత్నములకు తోడ్పడుదురని నమ్మెదము ప రాత్పరుని వేడుదు మీకు వందనము లర్పించుచున్నాము.

ఇట్లు విధేయులు
కందేపు వెంకటసుబ్బయ్య
కార్యదర్శి
కోసూరు పరబ్రహ్మం
పుస్తకభాండాగారాధిపతి.
కందేపు మల్లికార్జునుడు
ధనాగారాధిపతి.

విశ్వబ్రాహ్మణ
బాలసమాజపు కార్యస్థానం
కొల్లూరు.
20—6—15

## పద్యములు.

---

మ. రసికత్వం బెడబాపు కాకసకలారంభంబు లేవేళఁ గై
వసమై దారొక్కని సాంఘికక్రమణ భవ్యప్రీతి గల్పింపగా
బసమై కొల్లురుపట్టణస్థము గు విశ్వబ్రాహ్మణీయంపు బా
లసమాజంబు సమోత్సవంబుగన నుల్లాసంబు గాకుండునే.

సీ. కృష్ణకల్యాబంధ కేళిగాంచెడుచోట విబుధ తేజస్సత్త వెలయుచోట
కోహినూరుమణిపుట్టి కొమరుదేలినచోట కులము లైక్యతగని కులుకుచోట
భోగేశ్వర మహాభోగ్యతగనుచోట చిరతరపరిశోభ చెందుచోట
తరుణ విద్యార్థిబృందము సందడిలుచోట నవనాగరకదృష్టి దవులుచోట,
తే. గీ|| రొల్లవారికి నామోద మొసగుచోట
ప్రథిత కొల్లూరుపురిపేర బరగుచోట

పౌరుషేయాన్వయజ యువబాలకాళి
సంఘసభదీర్చగ నసంతసంబు గాదె.

సీ. మొదట నేతన్మాత్రముగ సమాజముగూర్చి గూర్చుమాత్రనె తృప్తి గాన (కయుండి
సమధికసంఖ్యతో సభ్యులనానగూర్చి, నానగూర్చుమాత్రన తనియకుండ
ధనసంచయమునకై తత్తరపాటూని తత్తరించినమాత్ర దరళకుండి
గ్రంథభాండాదిక క్రమణంబునెరపేర్చి నెరవేర్చుమాత్రన మరవకుండి
గీ. సంఘమందున జ్ఞాన సంసక్తి పొడమ
శక్తినంతయు వినియోగరక్తి జొనుపు
ప్రథిత కొల్లూరుపట్టణ పౌరుషేయ
బాలక సమాజమెంతయు బరగుటరుదె.

శా. విజ్ఞుల్ పెక్కురు మండలద్వయి యశోవిస్తారులైయుండి తా
మాజ్ఞన్ ద్రోసి మొకేటి వార్షికసభా ప్రారంభమే మానినన్.
ఆజ్ఞప్తిన్ శిరసా వహించినటు లాహా వీరు గైసేసినన్
ప్రజ్ఞావర్తత బాలకప్రతతికై భాసిల్లునా చిత్రమే.

సీ. కలవిద్యలెల్ల దిక్కులకు ప్రాకి విజ్ఞానవృష్టి ముంగొంగుగా వెలయుదాక
ఎల్లదేశంబులం దెసకు లోకజ్ఞత కరతలామలకమై కదగుదాక
ఆధునాతనసనాతనిరూఢ శిల్పముల్ సకలోపయోగ్యత సల్పుదాక
చరితార్థపెస్తృతి చరితార్థభరితమై వాఙ్మయవృద్ధితో వరలుదాక
గీ. పట్టుదలపట్టి పట్టినపట్టు విడక
స్వాభిమానంబు నిజగౌరవంబు నింపి
విదిత కొల్లూరుపురినున్న విశ్వకర్మ
కుల యువకసంఘ మెంతయు నిలదుగాక.

---

# దీక్షాభంగము - ప్రాయశ్చిత్తము.

గతసంచికలో చివర మంచికలపూడి వివాహములో బలభద్ర కోటయ్యగారు కన్యా వరశుల్కములనుగూర్చియు అతిబాల్యవివాహములను గూర్చియు నుపన్యసించునటుల వ్రాయఁబడి యున్నది. అయితే వీరా పెండ్లివారింట భోజన తాంబూలములను గైకొనిరి. అది మిగుల అక్రమము. దీక్షాభంగము. దీక్షాపత్రములపై సంతకములు చేసియున్న పౌరుషేయ సేవాసంఘములోనివారు ప్రవాసికోపన్యాసకుఁడను పేర విధాయకమును చెల్లింపఁబోయి 'పెండ్లిసందడిలో చలిదియన్నము దినమరచె' నన్నటుల, ఆవివాహములో భోజనముచేయ దీక్షాభంగమగునను మాట నిశ్చయముగ మరచిరి. దీక్షాభంగమునకు ప్రాయశ్చిత్తము చేసికొనవలసియుండును. భుజించిన పదార్థము నిశ్శేషముగ జీర్ణమైనపిమ్మట దానిని శుద్ధిచేయుటకు వీలుండదు. మనస్సు పశ్చాత్తాపమువలన శుద్ధియగును. ఇఁకముందు దీక్షలను గడు జాగ్రతతో పాలింతురని నమ్మెదను..

బ. కో.

# యుక్తిజీనగరము.

యుక్తిజీనగరము బుద్ధికుశలత గలిగినవారికి నిలయమై ప్రసిద్ధిగాంచినది అందలి జనులు తమ కుశాగ్రబుద్ధిచే బరులను హింసించుచుండెడివారు. ధీనిధియను నొక దండుడు వసించుచుండెను. ఈత డొకనాడు "మూడు వేల వరహాలకు మూడు సలహాల నమ్మెదను. నే నింకను సామెతలు, సుబోధ వాక్యములు,

ఘదనములు నమ్మెదను. బుద్ధిమంతులు కొనుక్కొని లాభము నందగలరు." అని కేకలిడుచు వీధుల వెంట దిఱుగసాగెను.

పొరుగూరి వర్తకుడొకడు ధనదాసుడనువాఁడీ కేకలను విని యాశ్చర్యమందెను. ఆ సామెతలను సలహాలను గొని లాభమువడయ నాశించెను. కాని వాని వెల యంతయుండునో? లాభము నిజముగ గలదో? యని యనుమానింపుచుండెను. ఆ కేకల వినినకొలదిని వాని యనుమానము తగ్గి యాశ హెచ్చుచుండెను. తుదకు మూడు వేలవరహాలనిచ్చి మూడు సలహాల నిమ్మనెను. ధీనిధి వానిని రహస్యస్థలమునకు గొనిపోయి "వంటవానిని నమ్మకుము 2. స్నేహితుని నమ్మకుము. 3. దైవమును నమ్ముము" అని మూడు వాక్యముల జెప్పెను.

వర్తకుడు లాభకారియగు బేరమును జేయలేదని విచారపడునట్లగుపడగా, ధీనిధి వానికి ధైర్యము చెప్పి యీ సలహాలననుసరించి వర్తించిన లాభము గలదని చెప్పెను. వానిపై జాలిపుట్టి మామిడి, నారింజ, జామ, రేగి, పుచ్చ దానిమ్మ, ద్రాక్షవిత్తుల నొక్కొక్కదాని వానికిచ్చి ధీనిధి యిట్లనెను. "మిత్రమా! వీనిని నేల వేయగానె పెద్దవృక్షములై పండ్లతో నిండియుండును. వానిని గోసికొని నీవును నీమిత్రులును భక్షింపుడు. 'పొండు' అని చెప్పగానె చెట్లు పోయి తిరిగి యీ విత్తనములు నీకు లభించును."

వర్తకు డింటికిబోయెను. వెంటనే విత్తనముల మహిమను బరీక్షింపనెంచి వానిని బాతిపెట్టినాడు. తక్షణమె ఫలములతో నిండిన చెట్లుగనబడినవి. వాని పండ్లను గోసి తానును మిత్రులును నందఱును భక్షించిరి. పొమ్మనగానె చెట్లు పోయి విత్తనములు తిరిగి లభించినవి.

ఆ విత్తనములను వర్తకుడు తన వంటవానికిచ్చి దినదినమును పండ్లనుపై రీతిని గల్పించుకొనుచు సుఖజీవనము చేయుచుండెను. వంటవాడు యజమానుని యింటనున్న వానిని దొంగిలించి మఱొక వర్తకుని కమ్మి లాభము నందుచుండెడివాడు. ఇప్పుడు యజమానుడు సదా వానిని కనిపెట్టియుండుటవలనత

నే దుస్తంత్రములు సాగుటలేదు. అంతట నితడు ధనలోభుడను రెండవవర్తకునితో గుట్రలు పన్నసాగినాడు.

ధనలోభుడు ధనదాసుని మిత్రుడగుటచేత కపటమును తెలియనీయకుండ నతనియింటికి వచ్చెను. మిత్రు లిరువురును ప్రేమమీర గౌగిలించుకొని కుశలప్రశ్నల నడుగుకొనిన యనంతరము నుచితాసనముల గూర్చుండిరి. కపటవర్తకుడు "అన్నా! నీవేమొ వింతవిత్తులు తెచ్చితివట! అవి భూమిలో వేయగానె చెట్లయి కాయలుగాయునట! ఎవడు నిన్ను మోసపుచ్చినాడోగాని నీవు నమ్మవలదుసుమీ. వానిని పరీక్షింపనిది నమ్మకుము" అనెను. ధనదాసు డామాటలవిని "నేను వానిని పరీక్షించినాను. మొన్న నీకుబంపినఫలములు ఈ విత్తుల చెట్లవే" అనిచెప్పెను. "నీవు భ్రమపడుచున్నావు. నేనైన నటుల మోసపోనుసుమీ. నాకండ్లార జూచినచో వానిమర్మమును నీకు దెలుపగలను" అని రెండవవాడు వాదింపసాగెను.

అంతట నతడు "నేను వానిమాహాత్మ్యమును జూపెదనేమిపందెమ"నెను. రెండవవాడు "నాయెదుట గింజలను నేలలో వేయుము. అవి నీవనినట్లు చెట్లయి ఫలించెనా నాయింట మొదట నీవు చేయివైచిన దేనినైన నీకిత్తును; లేదా నేను మీయింట మొదట దేనిపై చేయివేతునో దానిని నాకొసగుదువా"యనెను.

అమాయికుడగు ధనదాసు సరేయని వంటవానినిబిలిచి విత్తులనందిపుచ్చుకొని, నేలలోవేసి, చెట్లకై యెదురుచూచుచుండెను. అవి యెంతసేపటికిని మొలకెత్తలేదు. రెండవవర్తకుడు పందెమును జెల్లింపుమనసాగెను. మొదటివాడు విత్తులను పైకిదీసి పరీక్షింపగా నవి వేయించబడియుండుట దెలిసికొని వంటవానిమోసమును గనుగొనెను. వంటవానిని నిందింపుచు, విత్తులు మొలవమి తననేరముగాదనియు వంటవానిమోసమనియు జెప్పి పందెము వదులుకొమ్మని స్నేహితునివేడుకొని స్నేహితుడుగాన దన కపకారముచేయనొల్లడని నమ్మెను. * కపటియగు ధనలోభు డందు కంగీకరింపడయ్యె! తన ధన

వృపెట్టెలపై హస్తము నిడి దరిద్రుని చేయుమనని వర్తకుడు విచారింప సాగెను. తుదకు వారము దినములు గడువునకై వేడుకొని యెట్టకేలకు నొడంబఱచెను.

ఇప్పుడు వంటవానిని నమ్మవలదనియు, స్నేహితుని నమ్మవలదనియు, ధనదాసుడు గ్రహించినాడు. భగవంతుని నమ్మవలయునను సలహాను జ్ఞప్తికి దెచ్చుకొనినాడు. వెంటనే దేవాలయమునకరిగి దివారాత్రములు రెండుదినములు దేవుని బ్రార్థించినాడు. అంత భగవంతుడు వానినిబోయి ధీనిధి నాశ్రయించుమని చెప్పెను. ధనదాసు యక్షిణీనగరమునకు వెళ్లినాడు. అక్కడ నేమిజఱిగెనో మీకు ముందు దెలియగలదు.

## యక్షిణీనగరము. II

ధనదాసు ధీనిధి సలహాకొఱకు యక్షిణీనగరము వచ్చినాడు. ఒక బక్క-గుఱ్ఱముపైన గొన్నిధనపుసంచులను వేసికొని పోవుచుండెను. దారిలో నొకకటికివాడీ గుఱ్ఱము నెంతకిచ్చెదవని ప్రశ్నించినాడు. వర్తకుడు గుఱ్ఱము నమ్మనున్నవాడుగాడు. బక్క-గుఱ్ఱమును వీడు కొనునాయని వేడుకార్థము 400 రూపాయీల కిచ్చెదననెను. ఆకటికవాడు వెంటనే నాల్గువందల రూప్యములనిచ్చి గుఱ్ఱమును తోలుకొనిపోసాగెను. గుఱ్ఱముపైని ధనపుసంచులను తీసికొననున్న వర్తకునితో నవిలేకుండ గుఱ్ఱమును బేరము చేయలేదు. అవియు గుఱ్ఱముతో బేరములో గలసియున్నవని వాదులాడ తగవు విన్నవారును వానిపక్షమే తీర్పు చెప్పిరి. చేయునదిలేక వర్తకుడు సాగిపోయెను.

ధీనిధిగృహము వీనికి దెలియదు. దానికొఱకై విచారించుచుపోగా నొకచోటనున్న బాలురు వానికి దారిజూప నొడబడిరి. వారు చూచినవానిలో నెల్ల గొప్పలడ్డూలను వారికిచ్చునట్లు ధనదాసు వాగ్దానము చేసినాడు. అంతట నా బాలురు చాలసేపు నేలపై గణితమునువేసి క్షేత్రగణితమును బూర్తిగావించి

రొట్టెకేలకు వర్తకుని సందుగొందులలో త్రిప్పి ధీనిధియింటికి దోడ్కొనిపోయిరి. వారు ధీనిధిబంధువులే. ఇట్లునటించిరి.

వర్తకుని గుమ్మమునొద్ద నిలువబెట్టి యన్నిటికంటె పెద్దలడ్డూలను చెప్పమనిరి. అతడు రూపాయిపెట్టి లడ్డూలను గొనియిచ్చెను. వారు 'అన్నిటికంటె పెద్దలడ్డూలయినగాని పుచ్చుకొనము' నిరి. ఆవర్తకుడు రెండు, మూడు, తుదకు 50 రూపాయలను వ్యయముచేసెదననినను, వారు "అన్నిటికంటె పెద్దలడ్డూల నిమ్మని" పోరాటముసాగించిరి. అతని కేమియు దోచక విచారింపసాగెను. వారందఱికిని నన్నింటికంటె పెద్ద లడ్డూల నిచ్చుటెట్లు?

వీరిపోరాటమును విని ధీనిధి వెలికివచ్చి వర్తకుని సగౌరవముగ గూర్చుండజేసి వారితగవును విచారించెను. పిమ్మట నతడు రూపాయిపెట్టి కొన్నిలడ్డూలను చేయించినాడు. వానిలో నొకదానంత మఱొకటిలేకుండ జేయించినాడు. అన్నియు బరిమాణమున భేదముగనే యున్నవి. ఒకబాలుని ముందుబిలిచి నీవు అన్నింటికంటె పెద్దలడ్డూను దీయుమనెను. అత డటులనే చేసెను. అది అన్నిటికంటె పెద్దదా? యని ప్రశ్నించి యాబాలునిచేత నదితప్పక నన్నింటికంటె పెద్దదనిపించెను. దానినినీవు తీసికొనుమని వానిని నంపివేసెను. తరువాత రెండవవానికి నటులనే అన్నింటిలో పెద్దదాని నిచ్చెను. అటుల నందరికిని లడ్డులనిచ్చి "మీరన్నిటికంటె పెద్దలడ్డులను దీసికొనుడు వచ్చినారా లేదా" యనెను. వారు 'అవును' అనిరి. కావున నీవర్తకునిమాట చెల్లినదనిచెప్పి వారి నంపివేసెను. 50 రూపాయిలను గ్రహింపమి దను తెలివి తక్కువకు జింతిలుచు బాలురు వెడలిరి.

## యక్షిణీనగరము. III

బాలురు వెడలిపోయినపిమ్మట వర్తకుడు తాను ధీనిధి దర్శించుటకు వ

చ్చినకారణమును దెలిపి తనచిక్కులదీర్పుమని వేడుకొనెను. ధీనిధి వానిని వెంటబెట్టుకొని ముందు కటికివానియింటికి బోయెను.

కటికవానిని బిలిచి "మీయింటనున్న తలల నన్నింటి నెంతకిచ్చెద వు" అని ధీనిధి చేరమడుగగా వాడు 200 రూపాయీలకిచ్చెదననెను. వెంటనే 200 రూపాయీలను నెంచియిచ్చి వానినన్నింటిని దెమ్మనెను. వాడాదినమున నతికిని గొఱ్ఱెతలలను మేకతలలను గొడ్లతలలను దెచ్చియిచ్చినాడు. అన్నిటి నిచ్చితివాయన "ఇచ్చితిని. చూచుకొనుడు" అనెను.

"నీవు దొంగవలెనున్నావు. అబద్ధములాడుచున్నావని" ధీనిధి యడిగెను. అప్పుడు కటికవాని భార్యయు కూతురునుతొంగిచూచుచుండిరి. "అవిగో నీ భార్యతల, నీ కూతురుతల, ఇంక నీ యింటిలోనివారితలలు తెమ్ము! నీ యింటిలోని తల లన్నియు బేరమునకీయబడినవే" యని ధీనిధి పలికెను. కటికవాడు తన పొరబాటును గ్రహించి క్షమింపవేడుకొనెను. తనయొద్దన పరాధముగా 2000 వరహాలు పుచ్చుకొని బేరమును వదలుకొనుమని ప్రార్థింపసాగెను. "నిన్న నీవుకొనిన గుఱ్ఱమును ధనపుసంచులతో నామిత్రునకిచ్చివేయుము. ఇప్పు డపరాధముక్రింద 1000 వరహాలనిమ్ము" అని వానిని బుచ్చుకొని ధీనిధి వర్తకునిదీసికొని వెడలిపోయెను.

"నీవు వర్తకుడవు. నేర్పరినని గర్వింతువు. తిన్నగ మాటలాడజాలవు. నీవీ నగరమున మెలకువగలిగి నీమాటల యర్థమును బూర్తముగ ముందు విచారించి పలుకుచుండుము. లేకున్న మోసము గును. మూడు దినములుండి మనము పయనమగుదుము." అని ధీనిధి తన నెయ్యునికి సలహా చెప్పెను.

మరుచటినాడు ధనదాసుడు బజారునకుబోయి చెప్పులు కట్టించుకొనగోరెను. చెప్పులుకుట్టువానితో బేరముసాగించి జోటి కెంతబుచ్చుకొందువని య

డుగగా వాడు చాలమాదిరి చెప్పులనుజూపి వానిధరలను జెప్పెను. వర్తకు డొకమాదిరివానిని గొన్ని మార్పులతో జేయించుకొన నిర్ణయించుకొని వానివంటి వానిని దయారుచేయుమని కోరెను. వానిధర నాలుగురూపాయీ లుండునని వర్తకు డెంచి కొంచెము హెచ్చుతగ్గుగా నిచ్చి వానిని సంతోషపెట్టవచ్చునని యూహించెను. కావున ధరను ఖండితముగ నిర్ణయింపక " జోడు తయారు చేసి యిమ్ము నిన్ను సంతోషపెట్టెదన " నెను.

చెప్పులుకుట్టువా డటులనే జోటి నాదినము సాయంతనముననే తయారు చేసి వర్తకునికిచ్చి నన్ను సంతోషపెట్టుడని కోరెను. వర్తకుడు 4 రూపాయిల నియ్యగా నాడు వలదనెను, 5 రూపాయీలు, 6 రూపాయీలు తుదకు 50 రూపాయీలు వర్తకు డియ్యబోయెను. చెప్పులుకట్టువాడు " నన్ను సంతోషపెట్టుడు. మీ వాగ్దానము చెల్లించుడు. నాకీరూపాయీలెంత " అని వాదమాడ జొచ్చెను. వర్తకుడు కొంతసేపా గుడని ధీనిధి సహాయమును గోరెను.

ఆరాత్రి ధీనిధియు వర్తకుడును రాజభటులవేషముల ధరించి. లాటీకఱ్రుల దీసికొనిరి. చెప్పులుకుట్టువానింటికిబోయి తలుపులు బద్దలగునట్లు కొట్టి వానిని లేపిరి. వాడు తనయింటికి దొంగలువచ్చిరని భీతిచే యెవరని యడుగనైన సాహసింపడయ్యె. అంతట ధీనిధి " మేము రాజభటులము. రాజుగారికి కుమారుడుగలిగినాడు. నీవు వెంటనే మీయింట నుత్సవములు సాగింపవలెను " అని చెప్పెను. వర్తకుడు " నీవు వేగిరమే యుత్సవముల జేయుము. మేము తెచ్చిన వార్త నీకు హృద్యముగ లేదా ? " యనెను.

" బాబూ మీరీవార్త దెలిపి నన్ను జాలసంతోషపెట్టితిరి. ఇంతకంటె నాకు సంతోషమేడికలదు ? " అని వాడనగా ధీనిధి వానికి సంతోషము గలిగినట్లు నొక్కి నొక్కి చెప్పించెను. పిదప " మేము రాజభటులము గాము. మమ్మెను గుర్తింపుము. ఈయన నీయొద్ద చెప్పులుకట్టించలేదా ? " అని యడుగగా వాడావర్తకుని గుర్తుపట్టి " నాబాకీ నీయనే లేద " నెను. ధీనిధి

# భార్యయే మంత్రి.

(సౌ॥ పులివర్తి ఈశ్వరమ్మచే)

ఇంటిపనులయందు దాసివలెను, ఆలోచనచెప్పుటయందు మంత్రివలెను, భార్య భర్తకు తోడ్పడవలయునని బుధులు నుడివియున్నారు. ఈ ధర్మము ప్రస్తుతము మనదేశమున స్త్రీవిద్య చాలవరకు వెనుకబడియుండుటచేతను, స్త్రీ పురుషులకు దాంపత్యమేర్పడుటలో తగువారు సరియైన మార్గములను గమనింపకుండుటవలనను, క్షీణింపుచున్నది. విద్యాభ్యాసమునందును, సహచర్యమునందును, సాభిప్రాయులై మెలగు కన్యావరులు ఏర్పడిన దాంపత్యమువలన ఈధర్మము బాగుగ నడువగలదని యీదిగువ వివరింపబడు ఉదాహరణమువలన తెలియగలదు.

ఒకదేశమునందు మిక్కిలి నాగరికమైన పట్టణముగలదు. ఆ పట్టణమందు మిక్కిలి దరిద్రుడైన పిల్లవాం డొకడు గలడు. వానికి అయిదుసంవత్సరములు రాకపూర్వమే వాని తలిదండ్రులు గతించిపోయిరి. ఆ నిరుపేద బాలుడు పట్టణమునందు తిరుగుచు ఎవరైనను ప్రేమగలిగి పెట్టినయాహారమును తినుచు కాలముగడుపుచుండెడివాడు. ఇట్లుండగా నొకనాడు ఒకవీధిని బోవుచుండగా నొక గొప్పయింటివారి వాకిట నెవరో తలుపుతట్టుచుండ తానునూ తలుపుగొట్టెను. అప్పుడు వారియింటియందు వంటచేయుస్త్రీవచ్చి తలుపు దీసెను. ఆమె బయటికి వచ్చినంతనే ఆ యింటి యజమానుడును వచ్చెను అతడీ బాలునిజూచి నీవెవరనియడిగి దిక్కులేనిబాలుడని తెలిసికొని లోపలికి తీసుకొనిపోయి తన పిల్లలలో నొక పిల్లవాడుగా మిక్కిలి ప్రేమతో జూచుచుండెను. యజమానునకు ముగ్గురు కొమార్లును నొక కొమార్తెయును గలరు. అందరు పెరుగుచుండిరి. వారింట ప్రతినెలకు పిల్లలకు కొంతసొమ్ము (పా

కెట్టుమనీ ) నిన్ను నాథుక గలడు. ఈబాలుడు తనసొమ్మునుబెట్టి ఒక పిల్లిని కొనెను. ఆపిల్లికి అందరును ఆహారముబెట్టి పెంచుచుండిరి. ఇట్లు కొన్నిదినములుగడచినతరువాత ఆ యింటియజమాని కొన్నిసరకులను ఓడపైవేసి చేరొకదేశమునకు పంపుచు బిడ్డలనందరిని బిలిచి వేడుకగా మీ రేమైనను పంపెదరా యని యడిగెను. వారందరును తమకుదోచినవేవో చెప్పిరి. ఈపిల్లవాడు తనదగ్గర ఏమియులేవని చెప్పలేక నిలిచెను. ఆ యజమానికుమార్తెకు ఈ బాలునిపై యదివరకే చాల ప్రేమకలదు. ఆసమయమందు 'నీపిల్లిని పంపుము' అని ఆలోచన చెప్పెను. అప్పటికి పిల్లికి నాలుగుపిల్లలుండెను. ఆపిల్లలతోకూడ పిల్లిని తీసుకొనివచ్చి జాగ్రత్తగా కాపాడవలసినదని ఓడనడుపువారితో చెప్పి పంపిరి. అట్లుపంపగా ఓడ కొన్నిదినములకు ఒకపట్టణపురేవు చేరెను. ఆపట్టణమందు ఎలుకలు విస్తారముగా నుండుటచేత వాటినిచంపుపాయముగానక మిక్కిలి శ్రమపడుటవిని ఓడవారు ఈపిల్లులు ఎలుకలను చంపును. మాదగ్గర నాలుగుపిల్లులున్నవి. నాలుగులక్షలు యిచ్చినయెడల నీపిల్లుల నిచ్చెదమనిచెప్పిరి. అప్పుడా రాజు నాలుగులక్షలరూపాయలనుయిచ్చి ఆనాలుగింటిని కొనెను, వారి కాయెలుకలబాధ తగ్గిపోయెను. ఆరూపాయల నన్నిటిని తీసుకొనివచ్చి ఈ బాలున కిచ్చిరి. వానితో స్వయముగా నోడనుగట్టి వర్తకముచేయుచు ఎక్కువగా చదువుకొని మిక్కిలిసుగుణుడని ప్రసిద్ధిజెంది కాలముగడుపుచుండెను. యజమానికొమార్తె ఇతనినే వివాహముచేసికొనెను. ఇట్లు కొంతకాలముజరుగగా ఒకదేశమునకు ఒక రాజు కావలసివచ్చెను. అందుకొరకు ఎవరుతగియుందురని విచారింపగా ఈయన తగియుండునని తెలిసికొని ఏనుగ తీసికొనివెళ్లి పట్టాభిషిక్తునిచేసిరి. ఆమె బుధులు చెప్పియున్న నీతిప్రకారము రాజకార్యములాలోచించుటయందు మంత్రిత్వమును వహించి మిగుల విద్యావతిగావున భర్తచేయు ప్రతిపనికిని తోడ్పడుచు పనులు నిర్వహించుచుండెను. ఇట్లే ప్రతిస్త్రీయును విద్యనేర్చినదై సుగుణవతియై వ్యవహారములయందు భర్తచేయు ప్రతి పనికిని తోడ్పడుట మేలని నా నమ్మకము.

ప్రతివారికిని రాజ్యమెక్కడిది? గృహమే రాజ్యము. గృహనిర్వాహకత్వమే రాచకార్యము. ధర్మపాలనమే రాజ్యపాలనము. ఒక సంసారమునందలి చిక్కులనన్నిటిని సక్రమముగ దీర్చి ప్రశాంతి జెందుట రాచకార్యనిర్వాహకమునకంటె నెక్కుడని పెద్దలందురు. సమస్తకార్యములయందు మంత్రివలె నాలోచన చెప్ప నేర్పరియగు భార్యగలవానికి శ్రమ లుండ నేరవు. శత్రుభయము లేదు. చింత కలుగదు. సదా సౌఖ్యమే గలుగును. బాలికలు నట్టివారిగా దయారుచేయవలయును.

---

# స్వవిషయము.

---

ఈశ్వరానుగ్రహమువలన నిప్పటి కేడుసంచికలను వెలువరిచితిమి. సర్వకార్యములకీశ్వరుఁడే సాక్షీభూతముగా నుండును. అనుకూలప్రతికూలములు, సఫలవిఫలములు, జయాపజయములు మున్నగునవి ఈశ్వరేచ్ఛ వలననే లభించుచుండును. స్వప్రయత్నశీలురకే సర్వేశ్వరుఁడు తోడ్పడునని బుధులు నుడువుదు ప్రయత్నమే ప్రజ్ఞకు మూలాధారమను భావమును స్థిరపఱిచిరి. ప్రయత్నమువలన నన్నికార్యములు సిద్ధించును. ఈధర్మము కడుసూక్ష్మమగు బీజమువంటిది. దీని నభిమానశీలురగువారి హృదయసీమల నాటినచో గొప్ప వృక్షమై ఫలమునిచ్చును.

గౌరవార్థ మెందరు పోషించుచున్నను, విలాసార్థ మెందరు సహాయప్రోత్సాహముల నొసఁగుచున్నను నిజముగా చందాదారుల సదభిమానమే పత్రికా ప్రచారమునకు మూలాధారము. గత వత్సరములయందు చందాదారులసంఖ్య తక్కువగా నుండుటచేఁ గడపటి మాసములయందు ధనలోప మేర్పడి ఒకటి రెండు సంచికలు కలిపివేయుటయు, నిలిపివేయుటయు సం

భవించుచు వచ్చినది. సకాలమునకు సక్రమముగ వెలువడజాలకుం డుటయే పత్రికలకు నిరుత్సాహకర మార్గము. ఈ సంవత్సర మట్టి యవస్థ సంభవించకుండ మా చందాదారుల నుద్రేకపరచితిమి గాని, ఫలముగ నజాలమైతిమి.

గత మహాజనసభలో ప్రబోధినికి ధర్మచందాల నొసఁగియున్నారు. మఱికొందరు వాగ్దానములను చేసియున్నారు. వారివాగ్దానములను దయతో శీఘ్రముగఁ జెల్లింప ప్రార్థించుచున్నారము.

ప్రబోధిని ప్రకటనను సంఘముతరఫున దీసికొనినపిమ్మట మూలనిధి నుం డి కొంత ధనమిచ్చుయాచారము కలదు. గతసంవత్సరపు ధనాగారాధిపతి బాంధుప్రాని యియ్యానందున బ్యాంకినుండి ధనముతీయుటకు వీలు లేనందున ఈసంవత్సర మేమియును ఇయ్యాలేదు. క్రొత్తయొన్నికప్రకారం కార్యనిర్వా హణసభ మారినది. మహాజనసభజరిగి ఇప్పటి కేడునెలలైనది. కార్య నిర్వ హణసభ్యు లొకసభనైన జరుపలేదు. త్వరలో నొకసభ జరిపి అందు ప్రబో ధినినిగూర్చి విచారింపఁబ్రార్థితులు.

# విచిత్ర ప్రసంగము.

(శ్రీశైల మల్లిఖార్జునుఁడు, కొండమీఁద కోటీశ్వరుడు, పుట్టలో సుబ్రహ్మణ్యేశ్వరుడు ప్రవేశము.)

మల్లి—బ్రహ్మపురంలో సంస్కృతపాఠశాల నిలుపుటకు నిశ్చయింపఁ బడిన ది. అందుకు మంచి గురువు కావలయును.

కోటీ—కొండ తలక్రిందపెట్టుకొని రాళ్లకొరకు వెతకినట్టున్నది. ఈశ్వరు డు, పార్వతి, విఘ్నేశ్వరుడు, పండితులుగారా?